ఓమ్.

పరబ్రహ్మణేనమః.

---

# పుణ్యాహవాచనమ్.

ఆశ్వలాయనగృహ్యపరిశిష్టేన

ఆంధ్రటీకయాచ

సహితమ్

బృందావన పురనివాసినా

(మచిలీబందరు)

ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజినా

(బియె. బియల్. డి॥ మునసఫ్. యఫ్. టీ. యస్).

విరచితమ్.

రెండవకూర్పు.

బాపట్ల

శ్రీకన్యకావరమేశ్వరీ ముద్రాక్షరశాలాయాం

ముద్రాపితమ్.

1911.

వెల ౨ అణాలు.

# పీఠిక.

పుణ్యాహవాచనమనగా పవిత్రమైనరోజును తెలియపరచుట. గర్భాధానము మొదలు పంచదశకర్మలయందును, తటాకాదిప్రతిష్ఠల యందును, వస్త్రోద్యాపనాదులయందును ప్రారంభమున పుణ్యాహవాచనకర్మ చేయబడుచున్నది. ఈకర్మవిధాయకసూత్రము ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమందు కనుపించుచున్నది. ఆసూత్రము గ్రంథప్రారంభమందు వ్రాయబడినది. ఇది పుణ్యాహవాచనమని, స్వస్తిపుణ్యాహవాచనమని, స్వస్తివాచనమని, శుద్ధిపుణ్యాహవాచనమని ఆయా కర్మలననుసరించి వాడబడుచున్నది. ఈకర్మయందుండుమంత్రములు కొన్ని ఋగ్వేదమందును, కొన్ని యజుర్వేదమందును, కొన్ని రెండు వేదములయందును ఉన్నవి. ఋగ్వేదమందుండు మంత్రములకు ఋగ్వేదభాష్యముననుసరించియు తైత్తిరీయశాఖయందుండు మంత్రములకు ఆభాష్యముననుసరించియు రెండువేదములయందుండు మంత్రములకు భాష్యభేదముకలిగియున్నప్పుడు ఈగ్రంథము తైత్తిరీయ సంబంధమగుటచేత తైత్తిరీయభాష్యముననుసరించియు అర్థము వ్రాయబడినది. ఈమంత్రములయొక్క శ్రౌతవినియోగము తెలియుటకు ఋగ్వేదమంత్రములకు ఆశ్వలాయనశ్రౌతసూత్రప్రకారమును తైత్తిరీయమంత్రములకుఆపస్తంబశ్రౌతసూత్రప్రకారమున్నువినియోగము అర్థముక్రింద గీతగీచి వ్రాయబడినది. ఇందువలన ఈమంత్రములయొక్క శ్రౌతవినియోగమునకును ఈకర్మయందుండువినియోగమునకును భేదము తెలిసికొనవచ్చును. సూత్రమందు శాంతి, పుష్టి మొదలగు పదియేనుతంత్రముల నుచ్చరించినపిమ్మట «పూర్వవత్తల్లింగమంత్రాన్వాచయిత్వా” అనియు, «శాంతిపవిత్రలింగాభిరృగ్భిరభిషించేయుః” అనియును ఉండుటచేత, పుణ్య, భద్ర, స్వస్తి, వృద్ధి, ఋద్ధి, పుణ్యాహ, దీర్ఘాయుః, క్షేమ, పవిత్ర, శుద్ధ, పునాతు, శుచి, మొదలగు పదములుగలమంత్రములు ఈకర్మయందుండు వినియోగము

తో నర్థసందర్భము లేకపోయినను ఇచట ఉపయోగపరచబడుచున్నవి.

ఈగ్రంథములోనున్న ఋగ్వేద, ఐతరేయములయందుండు మంత్రములను యాజుష్కులు తరుచుగ స్వర, పద, వ్యత్యయములతో పఠించుచున్నారు. ఋగ్వేద మీదేశమందు విస్తారముగా వాడుక లేకపోవుటవలన ఇట్టివ్యత్యయము కలిగినట్లు రెంచి ఆవ్యత్యయమునకాధారముకనుపించకపోవుటచేత ఋగ్వేదగ్రంథము ననుసరించి మంత్రములు వ్రాయబడినవి.

సులభముగ నర్థము జూచుకొనుటకు ఈగ్రంథము వాక్యములుగా మార్చే భాగింపబడినది. అవి యేబదియారు. ఈగ్రంథమందుండు మంత్రములకు అక్షరసూచి యేర్పరచబడినది.

మూడువాక్యములు ఋగ్వేదసంబంధమయిన ఐతరేయ బ్రాహ్మణములోనివి. ఐతరేయ బ్రాహ్మణ భాష్యము లభించనందున మార్టిన్ హాగ్ (Martin Haug) దొరచే జేయబడిన ఇంగ్లీషు తర్జుమా సాహాయ్యమువలన ఈవాక్యములకు అర్థము వ్రాయబడినది. ౫౫-౫౬ వాక్యములు ఋగ్వేద ఖిల సంహితలోనివి. వాటికి భాష్యము లేదు.

ఈ పుణ్యాహవాచనములో కొంతభాగమునకు, కర్మాణః పుణ్యాహవాచనమని పేరు. అదికొన్నికర్మలయొక్క సమాప్తియందు చేయబడుచున్నది. అది ౨౯వ పేజీయందు వ్రాయబడినది.

ఆ॥ లక్ష్మీనరసింహం.

# ఆశ్వలాయన గృహ్యపరిశిష్టే.

## ౧ అధ్యాయః.

---

## ౧౩ ఖండః.

---

## పుణ్యాహవాచన సూత్రం.

---

అథ స్వస్తివాచన మృద్ధిపూర్తేషు స్వస్త్యయనం వాచయేదిత్యాచార్యః। ఋద్ధిర్వివాహాంతా అపత్యసంస్కారాః। ప్రతిష్ఠోద్యాపనే పూర్తం। తత్కర్మణ ఆద్యంతయోః కుర్యాచ్ఛుచి స్స్వలంకృతో వాచయీతతథాభూతే సప్తని మంగళసంభారభృతో, యుగ్మాన్ బ్రాహ్మణాన్ ప్రశస్తానాచారలక్షణసంపన్నానర్ఘ్యాదిభిరభ్యర్చ్య దక్షిణయా తోషయేదథ ప్రాఙ్ముఖాః ప్రశస్తాదర్భపాణయ స్తిష్ఠేయు స్స్వయం దక్షిణతో వాచయితోదఙ్ముఖస్సంస్కార్యో వాచయితు ర్దక్షిణపార్శ్వ మాతిష్ఠేయు రథవాచయితా దర్భపాణి రపాంపూర్ణముదకుంభం స్వర్చితం సపల్లవముఖం ధృత్వాతిష్ఠన్ సమాహితో మనస్సమాధీయతామితి బ్రాహ్మణాన్బ్రూయాత్సమాహితమనసస్స్మ ఇతి తేబ్రూయుః ప్రసీదంతు భవంత ఇతి వాచయితా ప్రసన్నాస్స్మఇతీతరేఽథ తేసర్వే సంహృత్య శాంతిః పుష్టిస్తుష్టిర్వృద్ధిరవిఘ్నమాయుష్య మారోగ్యం శివంకర్మ కర్మసమృద్ధి ర్ధర్మసమృద్ధిః పుత్రసమృద్ధిర్వేదసమృద్ధి శ్శాస్త్రసమృద్ధి ర్ధనధాన్యసమృద్ధి రిష్టసమృద్ధి రిత్యేతాని పంచదశతంత్రాణ్యుక్త్వాప తన్నామ్నా కర్మదేవతాం ప్రీయతామితి బ్రూయు రథ వాచయితాపూర్వవ ల్లింగమంత్రాన్ పఠిత్వా త్రిస్త్రి రత్రందమధ్యేచ్ఛస్వరై రోంపుణ్యాహం భవంతో బ్రువంతు స్వస్తిభవంతో బ్రువంతు ఋద్ధింభవంతో బ్రువంత్వితి బ్రూయాత్తేఽపి తథా ప్రత్యేకం ప్రతిబ్రూయు రోమిత్యృధ్యతా మిత్యృద్ధా ప్రతిబ్రూయు రథ ప్రాఙ్ముఖమాసీనం సామాత్యం కర్తారం బ్రాహ్మణాస్సపల్లవదర్భపాణయః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠేయు శ్శాంతిపవిత్రలింగాభి ర్ఋగ్భి రభిషించేయుః పురంధ్ర్యో నీరాజనాది కుర్యుః।

---

# పుణ్యాహవాచన సూత్రము.

## తెనుగర్థము.

### ఆశ్వలాయన గృహ్యపరిశిష్టములో ప్రథమాధ్యాయమందు పదమూడవ ఖండ.

అనంతరము స్వస్తివాచనము (చెప్పబడుచున్నది) బుద్ధికర్మల యందును పూర్తకర్మలయందును స్వస్తివాక్యములను చెప్పవలసినది అని ఆచార్యులు చెప్పిరి. (గర్భాధానము మొదలు) వివాహముతుది గాగల బాలురకు జేయదగిన సంస్కారములు బుద్ధికర్మలు. (వాపీ కూపాదుల యొక్క) ప్రతిష్ఠయు (వ్రతాదులయొక్క) ఉద్యాపనమున్ను పూర్తకర్మలు, ఆకర్మల యొక్క ప్రారంభమందును అవసానమందును (స్వస్తివాచనమును) చేయవలసినది. (యజమానుడు) శుచియై అలంకరించబడినవాడై (స్వస్తివాక్యములను) పఠించవలసినది. అలంకరించబడిన మంగళవస్తువులు కలిగియున్న గృహమందు యోగ్యులును ఆచారసంపన్నులును (అయిన) స్వాంవ్యాయు[illegible]యున్న బ్రాహ్మణులను అర్ఘ్యపాద్యాదులచే పూజించి దక్షిణచే సంతోషపెట్టవలసినది. పిమ్మట యోగ్యులగు (ఆబ్రాహ్మణులు) దర్భలు హస్తములయందుగలవారై తూర్పుమొగముగలవారై ఉండవలసినది. (పుణ్యాహమంత్రములను) పఠించే (యజమానుడు) ఉత్తరముఖముగలవాడై ఆబ్రాహ్మణులకు దక్షిణదిశయందు (ఉండవలసినది) (యజమానునిచే) సంస్కారము జేయదగిన (కుమాళ్లు మొదలగువారు) యజమానుని యొక్క దక్షిణభాగమందుండవలసినది. పిమ్మట యజమానుడు దర్భలు హస్తమందు గలవాడగుచు ఉదకముతో నిండియున్న అలంకరించబడిన చిగుళ్లు ముఖమందుగల ఉదకపాత్రము ను ధరించి ఉన్నవాడగుచు స్థిరచిత్తుడై మనస్సు స్థిరపరచబడుగాక అని బ్రాహ్మణులనుగూర్చి చెప్పవలసినది. స్థిరపరచబడిన మనస్సు గలవారమగుచున్నాము అని ఆబ్రాహ్మణులు (ప్రతివాక్యమును) చె

ప్పవలసినది. (ఓ బ్రాహ్మణులారా) మీరు ప్రసన్నులగుదురుగాకఅ ని యజమానుడు (చెప్పుచున్నాడు) ప్రసన్నులమగుచున్నాముఅని బ్రాహ్మణులు (చెప్పుచున్నారు) పిమ్మట ఆయజమానుడు బ్రాహ్మణు లున్ను అందరునుకూడి శాంతి, పుష్టి, తుష్టి, వృద్ధి, అవిఘ్నము, ఆ యుష్యము, ఆరోగ్యము, శివమైనకర్మ, కర్మసమృద్ధియు, ధర్మసమృ ద్ధియు, పుత్రసమృద్ధియు, వేదసమృద్ధియు, శాస్త్రసమృద్ధియు, ధనధా న్యసమృద్ధియు, ఇష్టసమృద్ధియు అను నీపదియేనుకృత్యములు చెప్పబ డినవి. ఆ పేరుచేత కర్మదేవతనుగూర్చి తృప్తిపొందుగాక అనిచెప్ప వలసినది. పిమ్మట యజమానుడు పూర్వమువలె శాంతి, పుష్టి. (మొ దలగుపదములు) గలమంత్రములను పఠించి మూడేసిమార్లు (మొద టిపర్యాయము)అల్పస్వరముచేతను(రెండవపర్యాయము)మధ్యమ స్వ రముచేతను (మూడవపర్యాయము) ఉచ్చస్వరముచేతను ‹‹ఓం పు ణ్యాహం భవంతో బ్రువంతు'' ‹‹స్వస్తిభవంతో బ్రువంతు'' ‹‹ఋ ద్ధింభవంతో బ్రువంతు'' అని (ఈమూడువాక్యములను) చెప్పవల సినది. ఆ బ్రాహ్మణులున్ను వేరువేరుగా ప్రతివాక్యమును పలకవల సినది. ఋద్ధికర్మయందు ‹‹ఓమిత్యృధ్యతాం'' అని ప్రతివాక్యమును పలకవలసినది. పిమ్మట తూర్పు మొగముగా కూర్చున్న భృత్యాదుల తో కూడియున్న యజమానునిగూర్చి బ్రాహ్మణులు చిగుళ్ళతోను దర్భలతోను కూడిన హస్తములు గలవారగుచు పడమర మొగము లు గలవారలయి ఉండవలసినది. శాంతి, పవిత్ర మొదలగు పద ములుగల ఋక్కులచేత (యజమానుని) అభిషేకము జేయవలసిన ది. కుటుంబవంతులయిన సువాసినీ స్త్రీలు నీరాజనము మొదలగు దానిని చేయవలసినది.

పుణ్యాహవాచనసూత్రము సమాప్తము.

---

# మంత్రాక్షర సూచీ.


| | |
|---|---|
| అగ్నిశ్శుచివ్రతతమ | ౨౩ |
| అమీవహా వాస్తోష్పతే | ౨౭ |
| అర్చతప్రార్చత | ౮ |
| అష్టౌదేవావసవ | ౧౯ |
| అంహోముచమాంగిరసం | ౨౮ |
| ఆదిత్యాఉదయనీయః | ౧౮ |
| ఆపఉందంతుజీవసే | ౧౨ |
| ఆయనే తేపరాయణే | ౯ |
| ఇంద్రశుద్ధోనఆగహి | ౨౪ |
| ఇంద్రశుద్ధోహినోరయిం | ౨౪ |
| ఉదగ్నేశుచయ | ౨౩ |
| ఉద్గాతేవశకునే | ౧౬ |
| ఋధ్యామస్తోమం | ౨౦ |
| ఋధ్యాస్మహవ్యై | ౨౧ |
| ఏతోన్వింద్రం | ౨౩ |
| గంధద్వారాం | ౯ |
| తానివా ఏతాని | ౧౭ |
| త్రీణిత్రీణివై | ౨౧ |
| దక్షిణోదాదక్షిణస | ౧౧ |
| నవోనవోభవతి | ౧౧ |
| ప్రాచ్యాందిశిదేవా | ౨౫ |
| బ్రహ్మణేష్వమృతం | ౨౪ |
| భద్రంకర్ణేభి | ౧౦ |
| యత్ప్రాణ్యాంనక్షత్రం | ౧౬ |
| యస్త్వాహృదా | ౧౨ |
| యస్మిత్వాగ్ సుకృతే | ౧౩ |
| యాజ్యయాయజతి | ౧౬ |
| వాస్తోష్పతే ప్రతిజానీ | ౨౬ |
| వాస్తోష్పతే శగ్మయా | ౨౭ |
| శుచీవోహవ్యా | ౨౨ |
| సద్యోవ్యమృగ్ణమృధ్నుయా | ౨౦ |
| సవితాపశ్చాత్తాత్ | ౧౧ |
| సంత్వాసించామి | ౧౩ |
| స్వస్తయేవాయు | ౧౭ |
| స్వస్తినఇంద్రో | ౧౮ |
| స్వస్త్యయనంతార్క్ష్యం | ౨౮ |


---0---

# ఈగ్రంథమందుండు సం[stamp]

———o———

ఋ-౮-౬౯-౮=ఋగ్వేదము. ౮ మండలము. ౬౯ సూక్తము ౮ ఋక్కు.

తై-ఆ-౧౦-౧-౧౦=తైత్తిరీయ-ఆరణ్యకము-౧౦ ప్రపాఠకము- ౧అను వాకము. ౧౦ పనస.

తై-సం-౨-౪-౧౪-౧=తైత్తిరీయ-సంహిత. ౨ కాండ- ౪ ప్రపాఠకము- ౧౪ అనువాకము. ౧ పనస.

ఐ-బ్రా-పం-౨-ఖం౪౦=ఐతరేయ-బ్రాహ్మణము.-౨పంచిక౪౦ఖండ.

ఆశ్వ- గృ-౩- ౧౦-౯ =ఆశ్వలాయన-గృహ్యసూత్రము. ౩ అధ్యాయము. ౧౦ ఖండిక ౯ సూత్రము.

తై - బ్రా-౧-౫-౨-౧= తైత్తిరీయ, బ్రాహ్మణము. ౧ కాండ. ౫ ప్రపాఠకము. ౨ అనువాకము. ౧ పనస.

మూ=మూలము.

అ=అర్థము.

(   )=మూలములో లేనట్టియు, సందర్భముచే నర్థమందు వ్రాయబడినట్టియు పదములను తెలియజేయు సంకేతము.

———

స్మార్తానుక్రమణికాయాం

... పుణ్యాహవాచనః

౧॥ మూ॥ ఓం పుణ్యాహం దీర్ఘమాయురస్తు॥శిరస్యభిమంత్ర్య

౨॥ శివా ఆపస్సంతు॥ కలశేమ్వాభిమృశ్య॥

౩॥ సౌమనస్యమస్తు॥ హృదయేఽభిమృశ్య॥

౪॥ అక్షతంచారిష్టంచాస్తు॥

౫॥ * అర్చతప్రార్చత ప్రియమేధాసో అర్చత । అర్చంతుపుత్ర

కా ఉతపురం నధృష్ణ్వర్చత॥ (ఋ ౮-౬౯-౮)

౬॥ అక్షతాః పాంతు।

౧॥ అ॥ (ఈరోజు నాకు) మంచిరోజు-అగుగాక. చిరకాలమైన ఆయుస్సు అగుగాక. (ఈవాక్యముచేతను) శిరస్సునందు అభిమంత్రణము జేసి అనగా శిరస్సును హస్తముచే స్పృశించి.

౨। ఉదకములు మంగళప్రదములు అగుగాక. (ఈవాక్యముచేతను) పుణ్యాహకలశమును స్పృశించి.

౩॥ మంచిమనస్సు అగుగాక. (ఈవాక్యముచేతను) హృదయమును స్పృశించి.

౪॥ అవినాశనమున్ను, శుభమున్ను అగుగాక.

౫॥ (ఓబ్రాహ్మణులారా-మీరు భగవంతుని) పూజించండి. అతిశయముగ బూజించండి. ప్రియమేధుడను ఋషియొక్క గోత్రజులారా (భగవంతుని పూజించండి) కుమారుల్లుపూజింతురుగాక-మరిన్ని పట్టణమువలె శత్రువులకునసాధ్యుడయిన(భగవంతుని)పూజించండి,

౬॥ అక్షతలు (మిమ్ము) రక్షించుగాక.

---

* ఈఋక్కునకు షోడశి శస్త్రమందు వినియోగము.

౭॥ $ గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాంకరీషిణీం॥ ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం॥ (తై-ఆ-౧౦-౧౦) గంధాః పాంతు॥

౮॥ † ఆయనే తే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః। హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే (ఋ౧౦,౧౪౨,౮,౮) పుష్పాణి పాంతు

౯॥ సుమంగళ్యంచాస్తు। శ్రేయసమస్తు॥ ప్రజాపతిః ప్రీయతాం। శాంతిరస్తు। సంకృత్యాస్సర్వవేదయజ్ఞ క్రియాకరణకర్మారంభా శ్శుభా

---

౭॥ పరిమళముచే గ్రహించదగినదియు (శత్రువులచే) భయపెట్ట శక్యముగానట్టియు (ధాన్యము మొదలగువాటిచే) ఎల్లప్పుడు నిండియున్నట్టియు గోవులు మొదలగువాటితో గూడినట్టియు సర్వభూతములను పుట్టించునట్టియు (అంతట చేతను) సేవించదగినట్టియు శ్రీ(భూమిని) ఇచటికి పిలుచుచున్నాను. గంధములు రక్షించుగాక.

౮॥ (ఓజగనంతుడా) నీవువచ్చినప్పుడును తిరిగి వెళ్ళినప్పుడును (మాయొక్క నివాసభూములయందు) పుష్పములుగలదూర్వలు మొలచుగాక. ఉదకాధారములున్ను పద్మములున్ను (ఉండుగాక) ఈగృహములు సముద్రసంబంధమైనవి అనగా సముద్రప్రాంతభూములవలె ఎల్లప్పుడును దహించబడనవి (అగుగాక) పుష్పములు రక్షించుగాక.

౯॥ సుమంగళమగుగాక; ఉత్తరకాలశ్రేయస్సు అగుగాక బ్రహ్మ(మంగళమును) చేయుగాక! శాంతియగుగాక. ప్ర(ఓంకారమును) చేసిఅనగా

---

$ స్నానాంగ మృత్తికాభి మంత్రణమందు వినియోగము.

† ఈఋక్కుచేత స్తంభమిత్రుడు స్వగృహమునకు అగ్నిభయము లేకుండుటను కోరెను.

శ్లో॥ భవాః ప్రవర్త్యతే తమహమోంకారమాదింకృత్వా భవద్భిరను జ్ఞాతః పుణ్యాహం వాచయిష్యే। $ వాచ్యతాం॥

౧౦॥ † భద్రంకర్ణేభిశ్శృణుయామదేవాః। భద్రంపశ్యేమాక్షభి ర్యజత్రాః। స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః। వ్యశేమ దేవహితం యదాయుః॥ (ఋ ౧, ౮౯, ౮,) (తై, ఆ, ౧, ౧.)

౧౧। *ద్రవిణోదాద్రవిణసస్తురస్యద్రవిణోదాస్సనరస్యప్రయంసత్

---

అనగా నుచ్చరించినను స్తవేదముల యొక్కయు యజ్ఞముల యొక్కయు వ్యాపారములకు సాధనమయిన కర్మల యొక్క ప్రారంభములు శుభముగాను మంగళముగాను జరుగుచున్నవో అట్టిఓంకారమును ముందుగా ఉచ్చరించి(ఓసభాజనులారా) మీచేత అనుజ్ఞబొందినవాడనగుచు పవిత్రమయిన పుణ్యాహ (మంత్రములను) నేనుచదివించుచున్నాను. చదువబడుగాక.

౧౦॥ దేవునిచే నివ్వబడిన ఆయుస్సును పొందుచున్నాము గనుక ఓదేవతలారా శ్రోత్రములచేత మంగళవాక్యములను వినుచున్నాము. సమర్థములయిన అవయవములతోను శరీరములతోను(కూడుకున్నట్టియు)యాగసమర్థులుయినట్టియు (మేము) (మిమ్ము) స్తుతించుచున్నవారమగుచు నేత్రములచేతమంగళకార్యములనుచూచుచున్నాము

౧౧॥ భగవంతుడుజంగమరూపమైనధనమును అనగా గవాశ్వాదిక

---

$ ఇది సభాజనులయొక్క అనుజ్ఞావాక్యము.

† ఋగ్వేదములో అగ్నిష్టోమ వైశ్వదేవ శస్త్రముయొక్క నివిద్ధానీయయందు వినియోగము.

తైత్తిరీయారణ్యకములో సావిత్రకాఠకమందు జలేష్టకోపధానమందువినియోగము.

ఈఋక్కు ఋగ్వేదమందు స్వర, అర్థభేదము గలిగియున్నది.

* యజ్ఞములో ప్రాతరనువాక ఆశ్వినశస్త్రములయందు వినియోగము.

ద్రవిణోదా వీరవతీ మిషన్నో ద్రవిణోదా రాసతే దీర్ఘమాయుః॥ (ఋ౧-౯-౬-౮.)

౧౨॥ * సవితా పశ్చాత్తాత్సవితా పురస్తాత్సవితోత్తరాత్తాత్స

వితా ధరాత్తాత్ । సవితానస్సువతు సర్వతాతిం సవితానో రాస

తాం దీర్ఘమాయుః॥ (ఋ-౧౦-౩౬-౧౪.)

౧౩॥ + నవోనవో భవతి జాయమానోఽహ్నాం కేతురుషసా మేత్య

ము ను (ఇచ్చుగాక) భగవంతుడు స్థిరరూపమైనధనమును అనగా గృహ క్షేత్రాదికమును (ఇచ్చుగాక) భగవంతుడు వీరులగు పుత్రులతోకూడిన అన్నమును మాకొరకు (ఇచ్చుగాక) భగవంతుడు దీర్ఘాయుర్దాయమును ఇచ్చుగాక.

౧౨॥ పడమరదిశయందున్న సవితృదేవతయున్ను తూర్పుదిశయందున్న సవితృదేవతయున్ను ఉత్తరదిశయందున్న సవితృదేవతయున్ను దక్షిణదిశయందున్న సవితృదేవతయున్ను మాకుసమస్తమయిన (కోరికలను) ప్రేరణజేయుగాక. అనగానిచ్చుగాక. సవితృదేవతయే మాకు దీర్ఘాయుర్దాయమును ఇచ్చుగాక.

౧౩॥ చంద్రుడు (ప్రతిదినము) (కళలయొక్క వృద్ధిక్షయముల చేత) జన్మించుచున్నవాడగుచు నూతనుడగుచున్నాడు. (అట్టిచంద్రునియొక్క దీప్తికి కారణుడయినసూర్యుడు) (దక్షిణాయనమందును ఉత్తరాయణమందునుగతిభేదముచేత నూతనుడగుచున్నాడు) పగళ్లకుచిహ్న

* అభిషేకవిధినమస్కాతహోమంలోయందు వైశ్వదేవతంత్రములో వినియోగము.
+ ఆదిత్య దేవతాకమయిన చరువుయందు పురోఽనువాక్యగా ఈ మంత్రమునకు రెండు వేదములయందొక్కటే వినియోగము.

గ్రే। భాగందేవేభ్యో విదధాత్యాయన్ప్రచంద్రమాస్తిరతి దీర్ఘమా
యుః॥ (తై-సం-౪-౧౪-౧) (ఋ ౧౦-౮౫-౧౯)

౧౪॥*ఆప ఉందంతు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే॥ (తై-సం ౧-౨-౧-౧)

౧౫॥†యస్త్వా హృదా కీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యో జో
హవీమి। జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభిరగ్నే అమృతత్వ మ
శ్యాం॥ (తై-సం-౧-౧। (ఋ ౫-౪-౧౦)

మయిన (సూర్యుడు) ప్రాతఃకాలముయొక్క ప్రారంభమందు (ఉద
యమును) పొందుచున్నాడు. దేవతలకొరకు హవిర్భాగములను ఇ
చ్చుచున్నాడు. (అట్టిసూర్యుడు) (ఇచటకు) వచ్చినవాడగుచు (మా
కు) దీర్ఘాయుస్సును ఇచ్చుగాక.

౧౪॥ జీవనముకొరకును దీర్ఘాయుస్సుకొరకును బ్రహ్మవర్చస్సుకొ
రకును ఉదకములు (నన్ను) తడుపుగాక.

౧౫॥ఓ భగవంతుడా మనుష్యుడయిన (నేను) స్తుతిజేసే స్వభావము
గలమనస్సుచేత నిన్ను నాశనములేనివానినిగా తలచినవాడనగుచు పి
లుచుచున్నానుగనుక మాయందు సంతానముచేత(సంభవించెడి)కీర్తి
నిడుంచుము. అనగా సంతానముగలుగజేయుము. ఓ భగవంతుడా (నీయ
నుగ్రహమువలన) మరణరాహిత్యమును అనగా దేవత్వమును పొందెదను

*యజ్ఞదీక్షయందు వపనసంస్కారముకొరకు యజమానునియొక్క శిర
స్సును ఉదకములచేతతడుపుట యీమంత్రమునకు వినియోగము.
† పుత్రకామేష్టియందు పురోఽనువాక్యగా యీమంత్రమునకు రెం
డు వేదముల యందొక్కటే వినియోగము.

౧౬ ॥*యస్మై త్వగ్ సుకృతే జాతవేద ఉలోకమగ్నే కృణవస్స్యోనం అశ్వినగ్ సపుత్రిణం వీరవంతం గోమంతగ్ రయింనశ తేస్వస్తి॥(తై-సం ౧-౪-౪౬-౧) (ఋ-౫-౪-౧౧)

౧౭॥†సంత్వాసించామియజుషా ప్రజామాయుర్ధనంచ॥ (తై-సం-౧౬-౧౧) దక్షిణకలశమాదాయ ఈశాన్యకలశే కించిత్కించి దుదకంనినయతి॥

౧౮॥దీర్ఘమాయుఽస్తు। మనస్సమాధీయతాం। సమాహితమనసస్స్మః। ప్రసీదంతు భవంతః। ప్రసన్నాస్స్మః॥

౧౯॥ శాంతిరస్తు। పుష్టిరస్తు। తుష్టిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు

---

౧౬॥ జగత్తును తెలిసినఓభగవంతుడా నీవు మంచికర్మను చేసినజనునికొఱకు సుఖకరమయినస్థానమును కలుగజేయుచున్నావు (గనుక మంచికర్మ చేసిన) ఆజనుడు అశ్వములుగలిగినట్టియు పుత్రులుగలిగినట్టియు వీరులుగలిగినట్టియు గోవులుగలిగినట్టియు ధనమును లెస్సగా పొందుచున్నాడు.

౧౭॥ (ఓయుదకమా) నిన్నుయజుస్సుచేతఅనగా నీమంత్రముచేత (పాత్రయందు) స్రవింపజేయుచున్నాను.(యజమానునికి) సంతానమును ఆయుస్సును ధనమును (కలుగచేయుచున్నాను)(ఈమంత్రముచేత) దక్షిణభాగమందుండు కలశను స్వీకరించి ఈశాన్యకలశయందు కొంచెముగా ఉదకమును ఉంచుచున్నారు.

౧౮॥ దీర్ఘాయుస్సగుగాక. మనస్సుస్థిరపరచబడుగాక. (మేము) ప్రసన్నులగుచున్నాము.

౧౯॥ శాంతిఅగుగాక. పోషణముఅగుగాక. సంతోషముఅగుగాక

---

*పుత్రకామేష్టియందు యాజ్యగా ఈమంత్రమునకు వినియోగము.
† స్కన్నమయిన ఆజ్యమును అధ్వర్యుడు అభిమంత్రణము జేయుట యీమంత్రమునకు వినియోగము.

వృద్ధియుష్యమస్తు। ఆరోగ్యమస్తు।స్వస్తి శివంకర్మాస్తు।కర్మసమృద్ధిరస్తు। పుత్రసమృద్ధిరస్తు। వేదసమృద్ధిరస్తు। శాస్త్రసమృద్ధిరస్తు। ధనధాన్యస మృద్ధిరస్తు। బహిర్దేశేఅరిష్టనిరసనమస్తు। కలశానామీశాన్యదేశేఉద కంసించేత్। యత్పాపంతత్ప్రతిహతమస్తు। యచ్ఛ్రేయస్తదస్తు॥

౨౦॥ శుక్రాంగారక బుధబృహస్పతి శనైశ్చర రాహు కేతుసోమస హితాదిత్యపురోగాస్సర్వేగ్రహాః ప్రీయంతాం। తిథికరణముహూర్త జన్మనక్షత్రదిగ్దేవతాః ప్రీయంతాం, నైర్ఋతిదేశేసించేత్॥

౨౧॥ శామ్యంతుఘోరాణి। శామ్యంతుపాపాని। శామ్యంతుఈ తయః। శుభానివర్ధంతాం। శివాఋతువస్సంతు। శివాఓషధయస్సంతు శివావనస్పతయస్సంతు। అహోరాత్రేశివేస్యాతాం। ఉత్తరేకర్మణ్య

---

వృద్ధిఅగుగాక- విఘ్నములేకపోగాక- ఆయుస్సుఅగుగాక- రోగనివా రణముఅగుగాక-లెస్సగా మంగళమగుకర్మ అగుగాక-కర్మాభివృద్ధిఅగు గాక-పుత్రవృద్ధిఅగుకాక- వేదవృద్ధిఅగుగాక- శాస్త్రవృద్ధిఅగుగాక-ధన ధాన్యములకు సమృద్ధిఅగుగాక- వెలుపటిప్రదేశమందు అశుభనివృత్తి అగుగాక-కలశలకు ఈశాన్యదిక్కునందు ఉదకమునుస్రవింపజేయవ లసినది- పాపముకొట్టబడుగాక-శ్రేయస్సుకలుగుగాక.

౨౦॥ శుక్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శని, రాహువు, కే తువు, చంద్రునితోకూడిన సూర్యుడుమొదలగు సర్వగ్రహములు తృప్తినొందుదురుగాక. (ప్రతిపత్తుమొదలగు) తిథులున్ను (బవ, బా లవమొదలగు) కరణములున్ను (రెండుగడియలు ప్రమాణముగల) ముహూర్తములున్ను,జనన కాల నక్షత్రములున్ను,దిక్కులకు దేవతల యిన (ఇంద్రాదులున్ను) తృప్తినొందుగాక. నిర్ఋతిదిశయందు (ఉ దకమును) స్రవింపజేయవలసినది.

౨౧॥ భయంకరములగు కార్యములుశమించుగాక. పాపములుశమిం చుగాక. (అతివృష్టి మొదలగు) ఈతిబాధలుశమించుగాక. శుభము లువృద్ధినొందుగాక. (వసంతాది) ఋతువులుమంగళకరములగుగాక. లతాదులుమంగళకరములగుగాక. వృక్షములు మంగళకరములగుగా క. అహోరాత్రములు మంగళకరములగుగాక. జరుగబోవుకర్మా

విఘ్నమస్తు। ఉత్తరోత్తరం మహాభివృద్ధిరస్తు। ఉత్తరోత్తరాశ్శుభాః క్రియాస్సంపద్యంతాం॥

౨౨॥ అగ్నిపురోగావిశ్వేదేవాశ్చ ప్రీయంతాం, మహేశ్వరీపురోగామాతరః ప్రీయంతాం। ఇంద్రపురోగా మరుద్గణాః ప్రీయంతాం। వసిష్ఠపురోగాఋషిగణాః ప్రీయంతాం। శ్రీవిష్ణుపురోగాస్సర్వేదేవాశ్చ ప్రీయంతాం। ఆదిత్యపురోగాస్సర్వేగ్రహాశ్చ ప్రీయంతాం, ఋషయశ్ఛందాగ్‌స్యాచార్యా వేదాయజ్ఞాదక్షిణాశ్చ ప్రీయంతాం। బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ ప్రీయంతాం। బ్రహ్మవిష్ణుమహేశ్వరాశ్చ ప్రీయంతాం శ్రద్ధామేధే ప్రీయేతాం। ప్రీయతాం భగవాన్నారాయణః। ప్రీయతాం భగవాంత్స్వామీ మహాసేనః। ప్రీయతాం భగవాన్పితామహః। ప్రీయతాం భగవాన్ప్రపితామహః।

౨౩॥ సత్యా ఏతా ఆశిషస్సంతు। ౨౪॥ పుణ్యాహకాలా వాచ్యంతాం॥

యందుకు విఘ్నము లేకపోవుగాక. ముందు ముందు మిక్కిలి అభివృద్ధి అగుగాక. భవిష్యత్కాలమున శుభములగు కార్యములు కలుగుగాక.

౨౨॥ అగ్ని మొదలగు సర్వదేవతలు తృప్తినొందుదురుగాక. మహేశ్వరి మొదలగు మాతృదేవతలు తృప్తినొందుదురుగాక. ఇంద్రుడు మొదలగు మరుత్తులను పేరుగల దేవతలు తృప్తినొందుదురుగాక. వసిష్ఠుడు మొదలగు ఋషిగణములు తృప్తినొందుదురుగాక. విష్ణువు మొదలగు సర్వదేవతలు తృప్తినొందుదురుగాక. సూర్యుడు మొదలగు సర్వగ్రహములు తృప్తినొందుదురుగాక. ఋషులున్ను ఛందస్సులున్ను ఆచార్యులున్ను వేదములున్ను యజ్ఞములున్ను దక్షిణలున్ను తృప్తినొందుదురుగాక. పరబ్రహ్మమున్ను బ్రాహ్మణులున్ను తృప్తినొందుదురుగాక. బ్రహ్మయు విష్ణువు మహేశ్వరుడున్ను తృప్తినొందుదురుగాక. ఆస్తిక్యబుద్ధియును ధారణాశక్తియును తృప్తినొందుగాక. భగవంతుడగు నారాయణుడు తృప్తినొందుగాక. భగవంతుడగు కుమారస్వామి తృప్తినొందుగాక. తండ్రియొక్క తండ్రి తృప్తినొందుగాక. తండ్రియొక్క తాత తృప్తినొందుగాక.

౨౩॥ ఈ ఆశీర్వచనములు సత్యములగుగాక.

౨౪॥ పుణ్యాహకర్మకు కాలములు చెప్పబడుగాక.

ఘున్యఅపర్యేత్ । తావదికుర్వీత యథా కారీస్యాత్ । పుణ్యాహావవకురుతే॥ (తై-బ్రా-౧-౫-౨-౧).

౨౮॥ తానివాఏతాని యమనక్షత్రాణి యాన్యేవ దేవనక్షత్రాణి । తేషుకుర్వీత యత్కారీస్యాత్ । పుణ్యాహావవకురుతే॥ (తై-బ్రా-౧-౫-౨-౯)

౨౯ ఓం పుణ్యాహంభవంతో బ్రువంతు । ఓం పుణ్యాహం॥

౩౦॥ † స్వస్తయే వాయుముపబ్రవామహై సోమం స్వస్తిభువనస్య

వచ్చునో ఎంతకాలములో ఆనక్షత్రస్థానముయొక్క తూర్పుభాగమున సంచరించునో ఆకాలమందు కర్మను చేయవలసినది. (అట్లు చేసినవాడు) పుణ్యదినమందు చేసినవాడు (అగుచున్నాడు)

౨౮॥ ఆనక్షత్రములు (అనూరాధ మొదలుకొని భరణివరకును ౧౩ నక్షత్రములు) యమునివంటి నక్షత్రములు. ఏవి దేవనక్షత్రములో (కృత్తిక మొదలుకొని విశాఖవరకును ౧౪ నక్షత్రములు) ఆ నక్షత్రములయందుయజమానుడు (కర్మను) చేయవలసినది. ఆకర్మనుపుణ్యదినమందు చేసినవాడగుచున్నాడు.

౨౯॥ (ఓసభ్యులారా) మీరు పుణ్యాహమంత్రములను పలుకుదురుగాక: పుణ్యాహము అగుగాక.

౩౦॥ వాయువును (మాయొక్క) క్షేమముకొరకు పిలుచుచున్నాము. సోముడు లోకమునకుపాలకుడు (గనుక) సోమునిన్ని క్షేమమునిమిత్తము (పిలుచుచున్నాము) సర్వదేవగణములతో కూడిన బృహ

† వైశ్వదేవశస్త్రమందు ఈ ఋక్కునకు వినియోగము.

33॥ † అష్టౌదేవావసవస్సోమ్యాసః। చతస్రో దేవీ రజరాశ్శ్రవిష్ఠాః। తేయజ్ఞంపాంతు రజసఃపరస్తాత్ । సంవత్సరీణ మమృతగ్గ్ స్వస్తి॥

[తై-బ్రా-3-౧]

3౪॥ మహ్యాంసహకుటుంబాయ శుద్ధివృద్ధ్యభ్యుదయకర్మణేమహాజనాన్నమస్కుర్వాణాయాశీర్వచనమపేక్షమాణాయాయుష్మతే స్వస్తిభవంతోబ్రువంతు ఆయుష్మతే స్వస్తి॥

3౫॥ ఏవంతోః॥

3౬॥ ఓగ్ స్వస్తిభవంతోబ్రువంతు ఓగ్ స్వస్తి॥

---

33॥ సుందరమూర్తులుగల ఏనమండ్రు వసువులను పేరుగల దేవతలున్ను మరివి లేనట్టి నల్గురు ధనిష్ఠానక్షత్రదేవతలున్ను మనుష్యలోకముకంటె ఇతరస్థలమందు (ఉన్నట్టివారు అనగా వసుదేవతలు, ధనిష్ఠానక్షత్రదేవతలున్ను మాసంబంధమయిన) యజ్ఞమురక్షించెదరుగాక. (అందువలన నేను) సంవత్సర దేవతాసంబంధమయిన స్వర్గలోకమును క్షేమముగా (పొందుచున్నాను).

3౪॥ జాయాపుత్రాదులతో కూడినట్టియు పవిత్రతకును, వృద్ధికిని, నూతనశుభప్రాప్తికిని (హేతువయిన) కర్మగల పెద్దలనునమస్కరించుచున్నట్టియు ఆశీర్వచనమునుకోరుచున్నట్టియు ప్రశస్తమయిన ఆయుష్యముగలవానికొరకు (ఓసభ్యులారా) మీరుశుభమునుపలుకుడు. ఓయజమానుడా దీర్ఘాయుష్యముగల నీకొరకు, శుభముఅగుగాక.

3౫॥ ఇట్లు ముమ్మారు చెప్పవలయును.

3౬॥ (ఓసభ్యులారా మీయాశీర్వచనమును) స్వీకరించినాను. మరలమీరుశుభముపలుకుడు. అంగీకరించినాము (నీకొరకు) శుభము (అగుగాక).

---

† ధనిష్ఠాపక్షత్రేష్టియందు పురోనువాక్యగా ఈమంత్రమునకు వినియోగము.

౩౭॥ ఏవంతి॥

౩౮॥ † ఋధ్యామస్తోమంసనుయామవాచనూనోమంత్రంసరథే

హోపయాతం।యశోనపక్వం మధుగోష్వంతరాభూతాంశో అశ్వినోః

కామమప్రాః॥ (ఋ ౧౦-౧౦౬-౧౧)

౩౯॥ సర్వామృద్ధిమృధ్నుయామితితంవై తేజస్సైవ పురస్తాత్పర్య భవచ్ఛందోభిరత్ర్యధ్యతోఒక్షరైరు పరిష్టాద్గాయత్ర్యా సర్వాతోద్వాశ శాహం పరిభూయాత్సర్వామృద్ధిమార్ధ్నోత్సర్వామృద్ధిమృధ్నోతియ ఏవం వేద॥ (ఐ-బ్రా-పం-౪-ఖం-౨౩).

---

౩౭॥ ఇట్లు మున్మూరు (చెప్పవలయును)

౩౮॥ (ఓఅశ్వినీదేవతలారా)(మీకు) స్తుతినివృద్ధిపొందించెదము. (మీకు) హవిస్సును ఇచ్చెదము. (మీరిద్దరును) ఒక్కరథము నధిష్ఠించినవారలగుచు ఈకర్మయందు మీసంబంధమయినస్తుతినిగూర్చిరండి. హవిస్సులున్ను గోసంబంధమయిన కాచిసిద్ధము జేయబడిన మధురమయిన (పాలు నెయ్యిమొదలగుదానినిన్ని)(అపేక్షించి) రండి. (ఈ ప్రకారముగ) భూతాంశుడనుఋషి అశ్వినీదేవతలయొక్క కోరికను సంపూర్తి జేసెను.

౩౯॥ (ప్రజాపతి గాయత్రిచేత ద్వాదశాహక్రతువును అంతటను వ్యాపించి సమస్తమైనసమృద్ధినిపొందెనని,నికోరి ఎట్లుసిద్ధించునని తపస్సుచేసెను) ఆద్వాదశాహక్రతువుయొక్క పూర్వభాగమందు తేజోరూపముతోనున్ను మధ్యభాగమందుఛందోరూపముతోనున్ను ఉపరిభాగమందు అక్షరరూపముతోనున్ను గాయత్రివ్యాపించెను. గాయత్రిచేత ద్వాదశాహమునుఅంతటనువ్యాపించి సమస్తమైనసమృద్ధినిపొందెను. ఈప్రకారముదెలిసికొనువాడు సమస్తసమృద్ధిని పొందును.

---

† ఆప్తోర్యామక్రతువుయందు, అచ్ఛావాకాతిరిక్తమయిన, ఉక్థములో ఈఋక్కునకు వినియోగము.

౪౦॥†ఋధ్యాస్మహవ్యైర్నమసోపసద్య।మిత్రం దేవంమిత్రధేయంనో అస్తు।అనూరాధాన్ హవిషావర్ధయంతః । శతంజీవేమ శరదస్సవీరాః॥ (తై-బ్రా-౩-౧).

౪౧॥ త్రీణిత్రీణివైదేవానామృద్ధాని । త్రీణిఛందాగ్ంసిత్రీణి సవనాని।త్రయఇమేలోకాః ॥ ఋద్ధ్యామేవ తద్వీర్యఏషులోకేషుప్రతితిష్ఠతి॥ (తై-బ్రా-౧-౫-౬-౬)

౪౨॥ వామదక్షిణహస్తాభ్యాందక్షిణోత్తరకలశౌయుగపద్గృహీత్వా

౪౦॥ మిత్రుడనుపేరుగలదేవుని (మేము) నమస్కారము చేతనున్ను హవిస్సులచేతనున్ను సేవించిసమృద్ధిగలవారమగుచున్నాము. మిత్రదేవునిచేత సంపాదించదగిన (శ్రేయస్సు) మాకుంగుగాక. అనూరాధా నక్షత్రదేవతలనుహవిస్సుచేతవృద్ధినొందించుచున్నవారమగుచువీరులగు(పుత్రాదుల)తోకూడినవారమైనూరుసంవత్సరములనుజీవించెదము

౪౧॥ దేవతలకు మూడేసిమూడేసి[వస్తువులు]సమృద్ధికరములైనవి(అవియేవియనగా) గాయత్రి,(త్రిష్టుప్,జగతి,అను పేరుగల)మూడుఛందస్సులున్ను, (ప్రాతస్సవన, మాధ్యందినసవన, తృతీయసవనములను పేరుగల)మూడుసవనములున్ను (స్వర్గ,మర్త్య, పాతాళములను పేరుగల) ఈమూడులోకములున్ను-గనుక (మూడు శ్వేత రేఖలుగల శలలీమృగసంబంధమైనతీక్ష్ణాగ్రముగలరోమములచేతను వపనము జేయదగిన కేశములనువిభజించినజనుడు)సమృద్ధియందునుపరాక్రమమందును ఈమూడులోకములయందు ప్రతిష్ఠగలవాడగుచున్నాడు.

౪౨॥ ఎడమచేతితోనుకుడిచేతితోనుదక్షిణఉత్తరభాగములయందును

† అనూరాధా నక్షత్రేష్టియందు పురోనువాక్యగా ఈ మంత్రమునకు వినియోగము.

బుద్ధింభవంతో బ్రువంతు। బుధ్య తామృద్ధిస్సమృద్ధి॥ముఖసమముద్ధృత్య స్వస్తిపుణ్యాహసమృద్ధిరస్తు।వర్షశతసంపూర్ణమస్తు।గోత్రాభివృద్ధిరస్తు। శాంతిఃపుష్టిశ్చాస్తు।శుభగ్ం శుభమస్తు।పునరపి గోబ్రాహ్మణేభ్యశ్శుభంభవతు।సర్వసంపదస్తు॥

౭౩॥ †శుచీవోహవ్యామరుతశ్శుచీనాగ్ శుచిగ్ంహినోమ్యధ్వరగ్ంశుచిభ్యః।ఋతేనసత్యమృతసాప ఆయం చ్ఛుచిజన్మానశ్శుచయఃపావకాః॥

(తై-బ్రా-౨-౮-౫-౫) ఋ-౭-౫౬-౧౨)

---

ఉన్న కలశములను ఒక్కమారుగానుగ్రహించి(ఓసభ్యులారా)మీరుసమృద్ధికరమైనవాక్యము చు పలుకుడు. వృద్ధియు, సమృద్ధియు, అభివృద్ధి నొందుగాక. (కలశములను రెండింటిని)ముఖముతోసమానముగాఎత్తి క్షేమము గాపుణ్యాహకర్మకుసమృద్ధిఅగుగాక. (ఆయుస్సు) నూరుసంవత్సరములచే పూర్ణమైనదిఅగుగాక. (మాకు) వంశాభివృద్ధి అగుగాక. శాంతియు పోషణమున్ను అగుగాక. మిక్కిలిశుభమగుగాక. మరిన్ని గోవులకొరకును బ్రాహ్మణులకొరకును శుభమగుగాక. సమస్త సంపత్తున్ను అగుగాక.

౭౩॥ ఓవాయువులారా, పరిశుద్ధులయినమీకు శుచియైనహవిస్సులనుకలుగజేయుచున్నాను. శుద్ధములయిన [వాయువుల]కొరకుపరిశుద్ధమగునట్టియు హింసారహితమగునట్టియు [కర్మను సంపాదించుచున్నాను]యజ్ఞనిర్వాహకులున్నుపరిశుద్ధజన్మగలవారును పరిశుద్ధ[సంచారము]గలవారును[ఇతరులను]పవిత్రముజేసేవారును(అగువాయువులు) యజ్ఞముచేత సత్యరూపమయిన [ఫలమును] పొందించబడిరి.

---

† యజుర్బ్రాహ్మణమందున్న ఈమంత్రమునకు అన్న కాముని చే జేయబడుప్రశ్నిమారుత పశుపయాగమునకు పురోఽనువాక్యగా వినియోగము. ఋగ్వేదమందున్న ఈమంత్రమునకు అగ్నిమారుత శస్త్రమందు వినియోగము.

౪౪॥ అగ్నిశ్శుచివ్రతతమశ్శుచిర్విప్రశ్శుచిః కవిః। శుచీరోచత ఆహుతః॥ (తై-సం-౧-౩-౧౪-౮. ఋ ౮-౪౪-౨౧)

౪౫॥† ఉదగ్నే శుచయస్తవ శుక్రాభ్రాజంత ఈరతే। తవజ్యోతీగ్ంష్యర్చయః॥ (తై-సం-౧-౩-౧౪-౮. ఋ ౮-౪౪-౧౭)

౪౬॥ *ఏతోన్వింద్రంస్తవామ శుద్ధంశుద్ధేనసామ్నా। శుద్ధైరుక్థైర్వావృధ్వాంసం శుద్ధఆశీర్వాన్మమత్తు॥ (ఋ-౮-౯౫-౭)

---

౪౪॥ మిక్కిలి శుచియయిన వ్యాపారముగలవాడును శుద్ధుడయిన మేధావియును శుద్ధుడయిన కవియును అగు అగ్ని శుచియయినవాడగుచు అభిముఖముగా హోమముజేయబడినవాడయి ప్రకాశించుచున్నాడు.

౪౫॥ ఓయగ్నీ పరిశుద్ధములయిన నీయొక్క కిరణములు ప్రకాశించుచున్నవగుచు ఊర్ధ్వముగా వెడలుచున్నవి. పూజచేసేవారు నీయొక్క తేజస్సులను (పొందుచున్నారు).

౪౬॥ (ఓమునులారా మీరు) శీఘ్రముగ ఇంద్రునిపొందుడి. శుద్ధిహేతువయిన సామముచేతనున్ను శుద్ధిహేతువులయిన శస్త్రముల చేతనున్ను (ఋక్సముదాయముచేత) శుద్ధుడయిన ఇంద్రుని స్తుతించెదము. వృద్ధిబొందుచున్న (ఇంద్రుని) పరిశుద్ధమయిన (నెయ్యి, పాలు, మొదలగువాటితో) సంబంధముగల (సోమము) సంతోషపెట్టుగాక.

---

† యజుస్సంహితలోనున్న ఋఙ్మంత్రమునకు పావమానేష్టియందు మూడవహవిస్సునకు యాజ్యగా వినియోగము. ఋక్సంహితలోనున్న ఋఙ్మంత్రమునకు ప్రాతరనువాకాశ్వినశస్త్రమందు వినియోగము.

* ఈఋక్కునకు తృతీయసవనములో ఆభిప్లవిక శస్త్రమందు వినియోగము.

౪౭॥ * ఇంద్ర శుద్ధో న ఆ గహి శుద్ధః శుద్ధాభిరూతిభిః। శుద్ధో రయిం ని ధారయ శుద్ధో మమద్ధి సోమ్య॥ (ఋ-౮-౯౫-౮)

౪౮॥ † ఇంద్ర శుద్ధో హి నో రయిం శుద్ధో రత్నాని దాశుషే। శుద్ధో వృత్రాణి జిఘ్నసె శుద్ధో వాజం సిషాససి॥ (ఋ-౮-౯౫-౯)

౪౯॥ ‡ బ్రాహ్మణేష్వమృతగ్ం హితం। యేన దేవాః పవిత్రేణ। ఆత్మా

---

౪౭॥ ఓయింద్రుడా (నీవు సామముల చేతను ఋక్కుల చేతను) పరిశుద్ధుడవగుచు మమ్ములను గూర్చి రమ్ము. పరిశుద్ధములయిన సాయములతో గూడ పరిశుద్ధుడవయిన (నీవు రమ్ము) పరిశుద్ధుడవయిన (నీవు మాయందు) ధనమును ఉంచుము. శుద్ధుడవయిన (నీవు) సోమరసమునకు అర్హుడవగుచు సంతోషించుము.

౪౮॥ ఓయింద్రుడా (నీవు) శుద్ధుడవగుచు మాకొరకు ధనమును (ఇమ్ము) శుద్ధుడవగుచు (హవిస్సును) ఇచ్చినవానికొరకు రమణీయవస్తువులను ఇమ్ము) శుద్ధుడవగుచు (వర్షమునకు) ప్రతిబంధకులయిన శత్రువులను చంపుము. శుద్ధుడవైన (నీవు మాకొరకు) అన్నము నిచ్చుటకు నిచ్ఛయించుము.

౪౯॥ బ్రాహ్మణులయందు నాశరహితమైన (ఫలము) సంపాదించబడినది (అగుగాక) దేవతలు ఏపవిత్రము చేతను దేహమును ఎల్లప్పుడును పవిత్రతనొందించుకొనిరో, వేయిధారలుగల ఆ (పవిత్రముచేత) పవమాన ఋక్కులు నన్ను పవిత్రుని జేయుగాక. ప్రజాపతిసంబంధమగు నట్టియు

---

* ఈ ఋక్కునకు ఆభిప్లవికశస్త్రమందు వినియోగము.

† ఈ ఋక్కునకు ఆభిప్లవికశస్త్రమందు వినియోగము.

‡ ఈ మంత్రమునకు యజ్ఞదీక్షయందు యజమానునికి పవిత్రతకొరకు జపముగా వినియోగము.

నం పునతేన దా। తేనసహస్రధారేణ। పావమాన్యః పునంతుమా। ప్రాజాపత్యంపవిత్రం। శతోద్యామగ్ంహిరణ్మయం తేనబ్రహ్మవిదోవయం। పూతంబ్రహ్మపునీమహే। ఇంద్రస్సునీతీసహమాపునాతు। సోమస్స్వస్త్యావరుణస్సమీచ్యా। యమోరాజాప్రమృణాభిఃపునాతుమా। జాతవేదామోర్జయంత్యాపునాతు। (తై-బ్రా-౧-౪-౮-౯)

౨౦॥ ప్రాచ్యాందిశి దేవాఋత్విజో మార్జయంతాం దక్షిణాయాందిశి మాసాః పితరోమార్జయంతాం ప్రతీచ్యాందిశిగృహాః పశవోమార్జయం

నూరుసూత్రములుగలుగునట్టియు (పాపమును) హరింపజేయునట్టియుప విత్రము(చేనైన)ఆపవిత్రముచేతను, వేదార్థజ్ఞానముగల మేముపరిశుద్ధమైనగొప్పదయిన(కర్మను)పవిత్రముజేయుచున్నాము. ఇంద్రుడు మంచినికలుగజేసే(దేవతతో)కూడానన్నుపవిత్రునిజేయుగాక. సోముడు క్షేమమునుకలుగజేసే దేవతతోకూడానన్నుపవిత్రునిజేయుగాక)వరుణుడు అనుకూలురాలయిన(దేవతతోకూడానన్నుపవిత్రునిజేయుగాక) రాజయినయముడు మిక్కిలిమరణమునుకలుగజేసే (దేవతలతోకూడా) నన్నుపవిత్రునిజేయుగాక. అగ్ని ఐశ్వర్యమునుకలుగజేసే(దేవతతోకూడా) నన్ను పవిత్రునిజేయుగాక.

౨౦॥ ఋత్విక్స్వరూపులయిన దేవతలు తూర్పుదిశయందు (నన్ను) పవిత్రునిజేయుదురుగాక. మాసాభిమానులయినపితృదేవతలు దక్షిణదిశయందు(నన్ను)పవిత్రునిజేయుదురుగాక. గృహములయొక్కయు పశువులయొక్కయు(అభిమానదేవతలు)పడమరదిశయందు(నన్ను)పవిత్రునిజేయుదురుగాక. ఉదకములయొక్కయుఓషధులయొక్కయువృక్షము

తాముదీచ్యాందిశ్యాపఓషధయోవనస్పతయోమార్జయంతామూర్ధ్వాయాందిశియజ్ఞస్సంవత్సరోయజ్ఞపతిర్మార్జయంతాం[తై సం౧,౬,౧,౭]

౫౧॥ ఏతేభ్యోబ్రాహ్మణేభ్యోనానాగోత్రేభ్యోనానానామభ్యశ్శ్రీలక్ష్మీనారాయణోమామహేశ్వరాదిత్యాది నవగ్రహస్వరూపేభ్యస్స్వస్తిపుణ్యాహవాచనమంత్రజపదక్షిణాం మానసోత్సాహ పరిమితాం సంప్రదదేనమమ॥

౫౨॥ †వాస్తోష్పతేప్రతిజానీహ్యస్మాంత్స్వావేశోఅనమీవోభవానః

లయొక్కయు(అభిమానదేవతలు)ఉత్తరదిశయందు[నన్ను] పవిత్రుని జేయుదురుగాక. యజ్ఞముయొక్కయు సంవత్సరముయొక్కయు యజ్ఞపతియొక్కయు[అభిమానదేవతలు]ఊర్ధ్వదిశయందు[నన్ను] పవిత్రుని జేయుదురుగాక.

౫౧॥ అనేకవిధమైనగోత్రములుగలుగునట్టియుఅనేకవిధమైననామములు గలుగునట్టియు లక్ష్మి,విష్ణువు,పార్వతి,మహేశ్వరుడు,సూర్యుడు మొదలగునవగ్రహములయొక్కస్వరూపముగ ఈబ్రాహ్మణులకొరకు[నాయొక్క]మనస్సునందుండుసంతోషమునకు తగినపుణ్యాహవాచనకర్మయందున్న మంత్రములయొక్కజపమునిమిత్తముదక్షిణను ఇచ్చుచున్నాను. [ఈదక్షిణ] నాకుకాదు.

౫౨॥ గృహపాలకుడవైన[ఓవాస్తోష్పత్యాగ్ని]మమ్ము [మరియొకస్థలమునకు వెడలుచున్నవారినిగా] తెలిసికొమ్ము. మమ్ము సుఖముగాప్ర

† అగ్నులతోగూడ ప్రయాణము వెడలుచున్న యజమానునిచే జేయబడు"వాస్తోష్పతీయ" హోమమందు యజుర్వేదమందున్న యీమంత్రమునకు వినియోగము.

†ఋగ్వేదమందున్న ఈమంత్రమునకుగృహనిర్మాణానంతరము వాస్తుహోమమందు వినియోగము.

యత్త్వేమహే ప్రతితన్నో జుషస్వ శంన ఏధి ద్విపదే శం చతుష్పదే॥ (తై-సం-3-౪-౧౦-ఋ ౭-౫౫-౧)

౫3॥ * వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే సక్షీమహి రణ్వయా గాతుమత్యా। ఆవః క్షేమ ఉత యోగే వరం నో యూయం పాత స్వస్తిభిస్సదా నః (తై-౪-౧౦-౧ ఋ-సం-౭-౫౫-3)

౫౪॥ అమీవహా వాస్తోష్పతే విశ్వా రూపాణ్యావిశన్ । సఖా సుశేవ ఏధినః। (ఋ-సం-౭-౫౬-౧) శుభగ్ం శుభం॥

వేశపెట్టువాడవును, రోగనివారణ జేయువాడవును, అగుము. నిన్ను ఏ(కార్యమును)కోరుచున్నామో ఆ(కార్యమును) మాకు సాధించుము. మాసంబంధమైన మనుష్యులకొరకు సుఖకరుడవు అగుము. పశువులకొరకు సుఖకరుడవు (అగుము).

౫3॥ గృహపాలకుడవయిన (ఓ గార్హపత్యాగ్ని) సుఖకరమగునట్టియు రమణీయమగునట్టియు జ్ఞానవంతమగునట్టియు నీసంబంధమైన సభతో (మేము) కలుసుకొనుచున్నాము. (నీసంబంధులమగుచున్నాము) మాకు క్షేమమునిమిత్తమున్ను యోగమునిమిత్తమున్ను లెస్సగా (నీవు) రక్షించుము. అనగా క్షేమలాభములను కలుగజేయుము. (ఓయగ్నులారా) మీరుమమ్ము ఎల్లప్పుడును శ్రేయస్సులచేత రక్షించండి.

౫౪॥ గృహపాలకుడవైన (ఓయగ్ని) రోగనివారకుడవగునట్టియు సమస్తమైన రూపములను పొందుచున్నట్టియు మిత్రుడవగునట్టియు (నీవు) మాకు సుఖకరుడవు అగుము.

* అగ్నులతోగూడ ప్రయాణము వెడలుచున్న యజమానునిచే జేయబడు "వాస్తోష్పతీయ" హోమమునిమిత్తము యజుర్వేదమందున్న యీమంత్రమునకు వినియోగము.

౫౩-౫౪. ఋగ్వేదములోనున్న ఈమంత్రములకుగృహానిర్మాణానంతరము వాస్తుహోమమునిమిత్తము వినియోగము.

౫౫॥ స్వస్త్యయనం తార్క్ష్యమరిష్టనేమిః మహద్భూతం వాయసం దేవతానాం। అసురఘ్నమింద్రసఖంసమత్సుబృహద్యశోనావమివారుహేమ (ఋ-సం-౫-౫౧-౧౬-ఖిల).

౫౬॥ అంహోముచమాంగిరసంగయంచస్వస్త్యాత్రేయం మనసాచతార్క్ష్యం। ప్రయతపాణిశ్శరణం ప్రపద్యేస్వస్తిసంబాధేష్వభయంనో అస్తు॥ (ఋ-సం-౫-౫౧-౧౭. ఖిల) శుభగ్ంశుభం॥

హరిః ఓం తత్సత్.

పుణ్యాహవాచనం సమాప్తం.

---

౫౫॥ శుభములకుస్థానమగునట్టియు, తృప్తునకిపుత్రుడగునట్టియు గొప్పవాడగునట్టియు, దేవతలలోపక్షిరూపుడగునట్టియు, యుద్ధమునందురాక్షసులనుజంపునట్టియుఇంద్రునికిమిత్రుడగునట్టియు అరిష్టనేమి యనుపేరుగల(ఋషిని సేవించుచున్నాము) గొప్పదయినకీర్తినిఓడనువలెఅధిష్టించుచున్నాము. అనగాపొందుచున్నాము.

౫౬॥ పాపమునువిడుపింపజేయునట్టిఅంగిరసునికిపుత్రుడగుగయుడను(ఋషినిన్ని) తార్క్ష్యుడను(ఋషినిన్ని)నియమించినహస్తములుగలవాడనగుచు అనగానంజలిజేయువాడనగుచుమనస్సుచేతరక్షకులనుగా సేవించుచున్నాను. మాకుయుద్ధములయందునిర్భయముగుగాక.

పుణ్యాహవాచనము సమాప్తము.

—o—

# కర్మణః పుణ్యాహవాచనమ్.

---

కర్మాంతే కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే ఇతి సంకల్ప్య॥ ఓం కర్మణః పుణ్యాహం భవంతో బ్రువంతు ఓం పుణ్యాహం కర్మణోఽస్తు। ఏవంత్రిః। యత్పుణ్యంనక్షత్రం। తద్భట్కుర్వీతోపవ్యుషం యదా వై సూర్య ఉదేతి। అథ నక్షత్రం నైతి। యావతి తత్ర సూర్యో గచ్ఛేత్। యత్ర జఘన్యం పశ్యేత్। తావతి కుర్వీత యత్కారీ స్యాత్। పుణ్యాహ ఏవ కురుతే॥ ఓం కర్మణే స్వస్తి భవంతో బ్రువంతు ఓగ్ స్వస్తి కర్మణోఽస్తు॥ ఏవంత్రిః॥ స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః। స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు॥ ఓం కర్మణ ఋద్ధిం భవంతో బ్రువంతు ఓం కర్మర్ధ్యతాం॥ ఏవంత్రిః॥ ఋధ్యాస్మ హవ్యైర్నమసోపసద్య మిత్రం దేవం మిత్రధేయం నో అస్తు। అనూరాధాన్ హవిషా వర్ధయంతః। శతం జీవేమ శరదస్సవీరాః। త్రీణి త్రీణి వై దేవానామృద్ధాని। త్రీణి ఛందాగ్ంసి త్రీణి సవనాని। త్రయ ఇమే లోకాః। ఋద్ధ్యామేవ తద్వీర్య ఏషు లోకేషు ప్రతితిష్ఠతి। ఋద్ధిం భవంతో బ్రువంతు ఋధ్యతామృద్ధిస్సమృద్ధిః। ముఖస్సమం కలశముద్ధరేత్। కర్మణః పుణ్యాహవాచన సమృద్ధిరస్తు। వర్షశతసంపూర్ణమస్తు। గోత్రాభివృద్ధిరస్తు। శాంతిః పుష్టిశ్చాస్తు। శుభగ్ం శుభమస్తు। పునరపి గోత్ర బ్రాహ్మణేభ్యశ్శుభం భవతు। సర్వసంపదస్తు। కర్మణః పుణ్యాహవాచన మంత్ర జపదక్షిణాం మానసోత్సాహపరిమితాం తుభ్యమహం సంప్రదదే న మమ॥

కర్మణః పుణ్యాహవాచనం సమాప్తమ్.

---